# తొలిపలుకు

రాజరంజనవిద్యావిలాస మను నీ యభినయరూపకమును విరచించిన కవి తుళజామహారాజు. ఇతఁడు క్రీస్తుశకము 1729-1735 ప్రాంతమున తంజాపూరును పాలించిన మహారాజు. ఇతనికిఁ దుక్కోజి యనికూడ మఱియొక పేరు. తంజాపూరులోఁ బ్రప్రథమముగా మహారాష్ట్రరాజుల పరిపాలనము నేర్పరచిన "ఏకోజి" లేక "వెంకోజి" యొక్క పుత్రులలోఁ గనిష్ఠుఁడు. ఇతనికి శహాజి, శరభోజి యని యగ్రజు లిద్ద రుండిరి. తల్లి పేరు దీపాంబిక లేక దీపాబాయి. ఇతఁడు తన మాతృభాష యగు మహారాష్ట్రభాషతో సమానముగ తెలుఁగు, తమిళము, సంస్కృతము మొదలగు భాషలలో నసమానపాండిత్యమును గడించి యుండెను. సంస్కృతవాఙ్మయ పరిచయముతోఁబాటు శాస్త్రము లందలి యితని యభిరుచిని సునిశితపాండిత్యమునుకూడ వెల్లడిచేయుచున్నవి ఇతని "సంగీతసారామృతా"దిక గ్రంథములు.

తెలుఁగున నిప్పటికి దొరకిన గ్రంథములలో నితఁడు రచించినవి రెండు. మొదటిది "*శివకామసుందరీపరిణయము" రెండవది "రాజరంజనవిద్యావిలాస" మను ప్రకృతగ్రంథము. తెలుఁగు వ్రాఁతప్రతుల కేటలాగు రెండవ భాగమును సిద్ధముచేయఁ బూనిన సందర్భములోఁ గొన్ని సంస్కృతగ్రంథములతోఁబాటు యీ గ్రంథముకూడ కలిసి యొకమూటలోఁ గనుగొనఁబడినది. ఆ మూటయొక్క సంఖ్య Amanath Bundle No. 16. ఈ గ్రంథముయొక్క సంఖ్య 13944. ఈ గ్రంథము 836-వ స సంఖ్యక్రింద కేటలాగులో వివరింపఁ బడియున్నది. దేవనాగరిలిపిని కాగితములపై వ్రాయఁబడియున్నది.

గాత్రపురిని జీవుఁడు సత్యజ్ఞానాదులతోఁ జేరి కామక్రోధమాయాదులను దరుమఁగా, నవి యాత్మేశునితోఁ మొఱపెట్టుకొనుట, ఆత్మేశుఁడు గాత్రపురి వృత్తాంతముల దెలుసుకొని రమ్మని మోహుని బంపుట. మోహుఁడు మోహన యోగి వేషధారి యై జీవమహారాజసన్నిధిని నరువదినాల్గు విద్యల నాడుట. జీవుఁడు తపఃస్థితి నుండుటయు నీశ్వరుండు ప్రసన్నుండౌటయు, జీవేశ్వరులు కూడి రతీమన్మథులకు వివాహమును గావించుటయు నిత్యాదికము లీ గ్రంథమున బ్రధానకథావస్తువు.

సువ్యవస్థితసత్యజ్ఞానధర్మాదులయొక్క సంగతిప్రభావమువలన పరిపుష్టి నందిన యోగమహిమచే, సాంసారికవ్యవస్థలో చిక్కుబడిన జీవుఁడుకూడ, సాంసారికవిధులను వదలకుండఁగనే ముక్తిని బొందవచ్చు ననుటయే యీ గ్రంథప్రతిపాదితకథాసందర్భమువలన మనకుఁ దెలియఁగల సారాంశము.

---

*D. No. 633 to 635 Telugu Mss. Catalogue Vol. I.

తంజాపూరు యక్షగానములలో నింతవఱకు నాయకరాజుల కాలము నాటివి ప్రచురింపఁబడియున్నవి. కాని మహారాష్ట్రరాజుల కాలమునకుఁ జెందిన వింతవఱకుఁ బ్రచురింపఁబడి యుండలేదు. ఈ సరస్వతీమహాల్ గ్రంథాలయము ప్రకటించు యక్షగానములలో మహారాష్ట్రరాజుల కాలమునకుఁ జెందినవానిలో నీ రాజరంజనవిద్యావిలాసమే మొట్టమొదటిది.

తంజాపూరి యాంధ్రనాయకరాజుల కాలపు యక్షగానములు క్రమక్రమ పరిణామమును జెంది సంస్కృతనాటకపద్ధతి నించుమించుగ నందిచూడసాగినవి. ఉదాహరణముగ, దక్షిణాంధ్రనాయకరాజ్యసింహాసనము నధిష్ఠించని నాయక మహారాజును విజయరాఘవనాయకుని పుత్రుఁడును నగు మన్నారుదేవుని కృతి హేమాబ్జనాయికాస్వయంవరమును పరిశీలింపవచ్చును. అందుఁ దత్పూర్వపు యక్షగానములవలె కాక, లోలోపల సూక్ష్మముగ పరిశీలించిన నంకవిభాగములు గోచరించఁగలవు. ప్రథమాంకము, ద్వితీయాంకము అని వాచికముగ నెచ్చటను చెప్పక పోయినప్పటికినిఁ గథాసందర్భముయొక్క పోకడ పై విషయమును రూఢిగ నిరూపింపఁగలవు.

అట్టి పరిణామక్రమములలో మరియొక్క యడుగు ముందుకు వేసియున్నదీ రాజరంజనవిద్యావిలాసము. ఇందు సంస్కృతనాటకములందు వలె సూత్రధార, పారిపార్శ్వకుల సంభాషణరూప మగు కృతితత్కర్తల నామోద్ఘాటనప్రధాన మైన ప్రస్తావన చాల ముఖ్యముగఁ బేర్కొనఁదగినది. ఇం దంకవిభాగానుకూలముగఁ గథాభాగము నడవకపోయినను పై విషయము మాత్రము తంజాపూరి యక్షగాన పరిణామములో నొకించుక ముఖ్యమైన భాగమునే యాక్రమించుచున్నది. ఇంచుమించు మహారాష్ట్రరాజుల కాలపు యక్షగానములు కొన్నిటిలో నీ ప్రస్తావనను చూడవచ్చును. కాలక్రమముగ మహారాష్ట్రరాజుల కాలపు యక్షగానములను కూడ కొన్నిటిని ప్రచురింపవలయు నని సంకల్పము. ఆ కార్యమున కిది "నాంది" యగుగాక! అందందు దిద్దుపాట్లు జరిగినచోట్ల యథామాతృకాపాఠములు క్రింద నివ్వఁబడియున్నవి.

ఈ పొత్త మాంధ్రపాఠకమహాజనుల యాదరాభిమానములకుఁ బాత్రము కాఁగలదని నమ్ముచున్నాను.

తంజావూరు
15-9-1960

విఠలదేవుని సుందరశర్మ

# రాజరంజనవిద్యావిలాసనాటకము



## తుళజామహారాజవిరచితము

ద్వి. శ్రీమచ్చిదానంద ! శివ ! జగత్కంద !
సామాదినిగమప్రసవమకరంద !
అతిశయాధారపద్మాంతస్సామోద
రతమధువ్రత ! లసత్ప్రణవస్వరూప !
పరిపూర్ణ ! నిర్గుణ ! బ్రహ్మాండకోటి
సురుచిరమణిసూత్ర ! సుజ్ఞానదీప !
సరసాక్షరాకార ! సజ్జనాధార !
కరుణించి రక్షించు కరుణాపయోధి !

నాంద్యంతే సూత్రధారః

వసంతఋతువర్ణనం

క. విలసితకిసలయనవసుమ
ఫలపరిమళశోభితములు భావజచాపో
జ్వలగుణశుకపికముఖరవ
మలయానిలభాసురములు మధువాసరముల్.

సూత్రధారుఁడు : ఓయీ ! పారిపార్శ్వకా ! సర్వసర్వంసహాధీశ్వరనిస్తులమస్తకన్యస్తమణిమయహాటకకిరీటకోటిప్రభాసీ రాజితచరణరాజీవుండును, రాజీవపత్రనేత్రసమాన తేజుండును, తేజోనిధివంశదీపుండును, దీపాంబికాగర్భసుధాపయోనిధి సుధాకరుండును, కరనిరసితపారిజాతుండును, జాతశమదమాదిగుణాభ్యుదయుం డగు తుళజమహీపురందరుండు గావించు నాదివరాహస్వామిమహోత్సవంబుఁ గనుఁగొన ఫరమహాంసలు, పరమ

యోగులు పరమమునులు పరమవైష్ణవులు తక్కిన రసికజనులు విద్వాంసులు వచ్చి సభగూడినారు, వీరలు యీ సభకు నుచితమైన చరిత్ర మభినయించ మని నియోగించిరి, ఏ నాటకంచేత మెప్పింతామోయి!

పారిపార్శ్వకుఁడు: ఏ మోయి! మహారాజువారు చేసిన నాటకం ఉన్నదిగదోయి!

సూత్ర: ఔనోయి! జ్ఞాపమాయనోయి!

గీ. ఇహపరంబులుఁ గలయ నూహించి భక్తి
వెలయఁ దులజేంద్రుఁ డెలమి గావించినట్టి
రాజరంజనవిద్యావిలాస మిప్పు
డభినయింతము సభ మెచ్చ నద్భుతముగ.

పారిపార్శ్వకుఁడు: ఓయి సూత్రధార! ఈ నాటకంబునఁ గల కథాసంవిధానంబు గురుస్తుతిపూర్వకంబుగా పలుకరింప వోయి!

సూత్ర: మహాభాగ్యమాయ నోయి!

శ్లో. నిత్యానందం నిరాకారం నిర్వికల్పం నిరంజనమ్।
నిష్కళంకం నిరాధారం నిర్గుణం [1]గురుమాశ్రయే॥

సరస్వతీప్రార్థన.

శ్లో. కచనిర్జితరోలంబాం సుచరిత్రాం స్మితాననామ్।
కుచోపరిలసద్వీణాం వచసాం దేవతాం భజే॥

ఆదిమకవిస్తుతి.

శ్లో. వామలూరుభవశక్తిపౌత్రకా
కాళిదాసభవభూతిదణ్డినః।
[2]బాణదోయజయదేవభారవీ
భారవింశ్చ సుకవీన్నమామ్యహమ్॥

---

1. శుభమాశ్రయే, 2. బాణధోయి,

ఏకమహారాజస్తుతి.

శ్లో. శ్రీవాణీపరిసేవితం సుచరితం వర్ణాశ్రమాణాం గురుం
బోధానందసుధాబ్ధిపూర్ణశశినం భూతేశపూజారతమ్ ।
సౌజన్యాదిగుణాశ్రయం జనహితం శాహావనీంద్రాత్మజం
లోకైరర్చితమేకభూపతిమహం భావే సదా భావయే ॥

దీపాంబికాస్తుతి.

శ్లో. సాధ్వీం సద్గుణశీలసువ్రతదయాదాక్షిణ్యసంశాలినీం
లావణ్యేన మనోహరేణ గిరిజారూపాం సతీం సత్ప్రజామ్ ।
అంబాపాదపయోజభక్తినిరతామాజన్మభాగ్యోదయాం
దీపాంబాం హృది భావయామి సతతం దివ్యాంగనాసేవితామ్॥

శాహమహారాజస్తుతి.

శ్లో. విద్యాసు హృద్యాసు మనోజ్ఞగద్య
పద్యాసు సర్వాసు నవీనభోజమ్ ।
ఆద్యం సతాం నీతిమతాం నృపాణాం
త్యాగేశరూపం శహభూపమీడే ॥

శరభమహారాజస్తుతి.

శ్లో. ప్రసూనబాణప్రతిమానురూపం
హాసన్ముఖం సర్వకళాసు దక్షమ్ ।
క్షమాభిరామం కలయేరిభీమం
శరీభభూమణ్డలసార్వభౌమమ్ ॥

సభాస్తుతి.

శ్లో. సభాధేనుమహం వందే చతుర్వేదపయోధరామ్ ।
సకలార్థప్రదోద్గ్రీం తాం విద్వద్వృందాంగశోభితామ్ ॥

భూప్రార్థన.

శ్లో. మహాపర్వతవక్షోజే చతురంభోధిమేఖలే।
కామితార్థప్రదే శ్యామే భూమిదేవి నమోస్తు తే॥

పుష్పాంజలి.

శ్లో. పశూనాం పతయే బాలశశిరేఖావతంసినే।
కుసుమేషుజితే శంభో కుసుమాంజలిరస్తు తే॥

కథాసంగ్రహం.

ద్వి. శ్రీకరగాత్రపురిని [1]జీవరాజు
చేకొని సుజ్ఞానచిత్తశర్మలను
సత్యధర్మాదుల సంగతివలన
నిత్యతఁ గోరి సన్నిహితకామాది
మాయలఁ దఱిమిన మసలుచు వారు
పోయి యాత్మేశుతోఁ బొడమిన బాధఁ
దెలుపుట నాతఁడు తెలిసి యాక్షణమె
పొలుచు మోహుని గాత్రపురికి నంపుటయు
నొంటిపున మోహనయోగి యై మోహుఁ
డఱువదినాల్గు విద్యల నాడుటయును
జీవుఁ డంతటఁ దపస్థితినుండ నీశుఁ
డావేళ వచ్చి ప్రత్యక్షమౌటయును
జేవేశ్వరులు గూడి చిత్తజునికిని
దేవి యా రతికినిఁ దిరమొప్పఁ బెండ్లి
జోకతో సేయుట శుభముహూర్తమున
నీకథలను గూర్చి యింపుతోఁ దుళజ
నరపతి గావించె నాటకంబుగను
ధరణిలో నాచంద్రతారార్కముగను.

---

1. జీవసంజ్ఞ.

పారిపార్శ్వకుఁడు: వినవోయి సూత్రధార! ఈ అద్వైతనామధేయంబు విన్నంత జనులు పావను లౌదురు. ఈ నాటకం నటించే మనకు శ్రేయస్సుకు తక్కువేమోయి, శీఘ్రముగా నటనారంభం సేయవోయి!

సూత్ర: మహాభాగ్యమాయనోయి!

విఘ్నేశ్వరప్రార్థన.

శ్లో. జాంబూనదాంబరవిరాజితమధ్యభాగం
జంబూఫలప్రియమపారదయానముద్రమ్।
అంబాసుతం మదవిఘూర్ణితగండయుగ్మం
లంబోదరం సకలవిఘ్నహరం నమామి॥

దరు - రాగం సౌరాష్ట్ర - ఆదితాళం

ప్రణవభవుఁడు వెడలె గణములతో గూడ
ఫణిభూషణసంతతు లసియాడ
బాలశశిధరగణపతి యాడ ॥ ౧ ॥
భీషణవిఘ్నముల శోషిల్లగఁ జేసి
మూషికవాహనమునఁ జెలగుచు శుభ
వేషుఁ డాగమవేద్యుఁ డాద్యుఁడు.

పారిపార్శ్వకుఁడు: వినవోయి సూత్రధార! నీవు తలంచఁగానే విఘ్నేశ్వరుఁడు వచ్చెను, మహాసంతోషమాయనోయి!

సూత్ర: ఇత్తెఱంగున పారిపార్శ్వకుఁడు సంతోషమాయ నని పలికినమాట వెంబడినే సంతోషుఁడు వచ్చే మార్గం.

దరు - రాగం పంతువరాళి - ఆదితాళం

సంతోషుఁడు వచ్చెను జనులు మెచ్చ, సంతోషుఁడు వచ్చెను.
వింతగా పలుకుచు విజయము నొసవుచు
గంతులు వేయుచు కలకల నవ్వుచు ॥ ౧ ॥

బిగువు మొదను పొదల పిల్లజుట్టు కదల
పొగడు వారి కిచ్చుచు పొంగిపొంగి మెచ్చుచు ॥ ౨ ॥

భాగవతులు: ఓయి! నీ వెవరోయి?

సంతోషుఁడు: ఓయి! నేను ఆత్మమహారాజువారి కటికీఁడ నోయి!

భాగ: నీవు వచ్చిన కార్య మేమోయి?

సంతోషుఁడు: ఆత్మమహారాజు నిజసభకు వస్తున్నాఁడు, మీరు తలచుట్టలు పారవేసి మొలను కట్టిన బట్టపేలికలు తీసివేసి కూటికుండల మీఁది యభిమానం బులు విడిచి సభబైలు చేసి యొకరితో నొకరు మాటలాడక గాలిమంద యెద్దులవలె మారాజును తలచుకొంటూ యథేచ్ఛగా తిరుగండోయి, యిటని దెలుప వస్తినోయి!

భాగ: భళా! మహాకౌతుకాయనోయి! నీ రాజును పిలుచుకు రావోయి!

సూత్ర: ఇత్తెఱంగున సంతోషుఁడు వచ్చిన తదనంతరంబున ఆత్మమహారాజు నిజ సభకు వచ్చేమార్గం.

దరు - రాగం కాపి - ఆదితాళం

వచ్చె నాత్మమహారాజు నిజసభకు, వచ్చె నాత్మమహారాజు
నిత్యుఁడు నిర్గుణుఁడు నిర్వికారుఁడు శుద్ధుఁడు
సత్యస్వరూపుఁడు సర్వమయుఁ డవ్యయుఁడు. ॥ ౧ ॥

సూత్ర: ఇత్తెఱంగున ఆత్మమహారాజు వచ్చి చిదాకాశపీఠంబునఁ గూర్చున్న తదనంతరంబున సంతోషుఁడు స్తోత్రం చేసే మార్గం.

సంతోషుఁడు: నిష్కళంక నిర్వికార నిర్వికల్ప నిరంజనా పరాకు! నిరామయ నిర్గుణ నిష్ప్రపంచ నిత్యశుద్ధ పరిపూర్ణ సచ్చిదానందస్వరూపా పరాకు!! మాయాతీతా పరాకు!!!

సూత్ర: ఇత్తెఱంగున సంతోషుఁడు స్తుతిచేసిన తదనంతరంబున కథాసంవిధానం బెటువలె నంటేను, గాత్రపురంబున జీవరాజు చిత్తశర్మ సుజ్ఞానవర్మలను గూడి మాయాదులను బాఱఁదోలగా మాయాదు లాత్మమహారాజు గతి యని బహుదినంబులు పుండరీకపురసమీపంబున నుండి యాత్మమహారాజు సముఖముఁ బ్రతీక్షింపఁగా నొకనాఁడు ఆత్మమహారాజు కొలువుకు వచ్చినాఁడని విని తొలుత మాయాదేవి వచ్చే మార్గం.

ద్వి. గరిమ బంగరుచీర కటితటిఁ బొదల
గురుతరం బగు గబ్బిగుబ్బలు కదల
బటువైన ముత్యాలపాపట చెదర
చటులనద్రత్న భూషణములు వదల
జోకమీనుల రీతి సొబగైన కన్ను
లాకర్ణపర్యంత మతిశయిల్లంగ
నందెల రొదలు రాయంచలఁ బిల్వ
మందయానముతోడ మాయ తా వెడలె.

దరు - రాగం ఆహిరి - తాళం ఝంప.

ఏమి సేయుదు నిందు కేమి సేతు నన్ను
పామరుఁడు జీవుఁడు పలుచనగఁ జేసె॥

పొంచి మెల్లనె గాత్రపురము ప్రవేసించి
వంచించి సుజ్ఞానవర్మ హితుఁడై
మించి జీవునికి బోధించి పగఁగొని నాడు
కంచంత కాపురము కలచె నయ్యయ్యో ॥ ౧ ॥

కలనైన గాని నాపలుకు జవదాఁటకను
వలమీను వలె తనకు వశ్యుఁడైన
అల జీవరాజు నేఁ డల్పసంగతి జేసి
తొలిప్రేమ వదలి కడత్రోసె నయ్యయ్యో ॥ ౨ ॥

దరు - రాగం భైరవి - ఆదితాళం

మాయాదేవి వెడలెను జనములను మరులుకొనఁగ సేయుచు
కాయజుని దంతిజాడను, మెల్ల మెల్లనే, కలహంస నడలతోడను ॥ ౧ ॥
మానులను ఘట్టింపుచు సంసారముల మమతల బుట్టింపుచు
పూనిజీవుని దూరుచు కామాదినిజపుత్రుల పాలి జేరుచు

సూత్ర : ఇత్తెఱంగున బంకువాకిటికి వచ్చి దీనురాలయి యున్న మాయావధూటిని జూచి సంతోషుఁడు పలికే మార్గం.

సీ. పలుమారు పిలిచిన పలుకువారలు లేరు
  యెలమితో వసియింప నిండ్లు లేదు
[1]చుట్టు జూచినగాని చెట్టుచేమలు లేవు
  గుంట చెరువులు బావి గుళ్లు లేవు
చలివిందలలు కూటిసత్రంబులా లేవు
  వసరిన నూరార్చువారు లేరు
మనుజసంచారంబు మందుకైనను లేదు
  పయిరుపంటలు లేవు బయలు గాని

తే. యీ పురినియుందు సామి కోకించుకైన
కులము రూపము నామము గుణము లేదు
పరఁగు తేజోమయం బైన పట్టణమున
కెట్టు వచ్చితివమ్మ! పూర్ణేందువదన!

సూత్ర : అని పలికిన సంతోషుని జూచి మాయాదేవి పలికే మార్గం.

క. ఈ పరమాత్ముఁడు సర్వ
వ్యాపకుఁడై జనుల బ్రోచు నని సిద్ధముగా
నీ పట్నమునకు వచ్చితిఁ
జేపట్టు మటంచు మనవి సేయుము విభుతో.

1. చుట్టి.

ఇదిగాక పరమాత్మ నిర్గుణుఁ డని పలకరించితివి గదా ! నే వచ్చినపుడే
సగుణుఁడై యే వుండు ననుమాట మందలించి భేటి సేయించ వోయి !

(సూత్ర): ఇత్తెఱంగున సంతోషుఁడు ఆత్మమహారాజుతో మాయ వచ్చె నని పలికిన
మాత్రంబున సగుణుఁడై ఆత్మ మాయను పిలువ మని, వచ్చిన మాయను
జూచి పలికేమార్గం.

క. కుశలమె జగముల కెల్లను
గుశలమె కామాదులకును గుశలమె నీకున్
శశివదన మాయ దెల్పుము
విశదంబుగ వచ్చినట్టి వృత్తాంతంబుల్.

సూత్ర : (ఇత్తెఱంగున పలికిన ఆత్మమహారాజును జూచి మాయ పలికేమార్గం.)

ద్వి. చిత్రంబు వినుము మచ్చిక నాత్మరాజ !
గాత్రపురం బేలు ఘనజీవరాజు
సుజ్ఞానవర్మను సారిది చేబట్టి
యజ్ఞానుఁ డై తన యాప్తవర్గముల
ధట్టింపుచును మెట్టు దాఁటించె నంత
పట్టెందు లేకను పరితాపపడుచు
గొడుకులు చెదరి దిక్కుల కేగఁ జూచి
కడుపు చురుక్కని కదలి యీపురిని
నిచ్చలు నెఱనమ్మి నీవె దిక్కనుచు
వచ్చియున్నాను దేవరచిత్త మికను.

సూత్ర : అని పలికిన మాయాదేవిని జూచి చూచి ఆత్మమహారాజు పలికేమార్గం-
వినవే మాయ !

క. భూవరుని కాప్తవర్గము
జీవం బిది నీతిశాస్త్రసిద్ధాంతములో
చావ విసుమంత సడలిన
తావున నెలకొనఁగఁగలవె తరుణి గణింపన్.

కాగా స్వామిభక్తిఁ గల యాప్తవర్గంబు రాజుకు బలఁబు, ఆయాప్త వర్గంబును విడజనదు. ఆ యాప్తవర్గమున్ను రాజును విడజనదు. ఇట్టిపట్ల జీవరాజును విడిచి మీా రిచ్చటికి వచ్చుట యనుచితంబు.

సూత్ర : అని పలికిన యాత్మరాజును జూచి మాయాదేవి పలికేమార్గం.

క. భూనాథుఁ గొల్చు బెల్లను
మానయశంబులకు గాక మరి డొక్కలకా
మానము పోయిన పిమ్మట
మానులకును బ్రదుకు లేల మది నూహింపన్.

సూత్ర : అని పలికి మరి న్నేమనుచున్నది.

దరు - రాగం ముఖారి - తాళం ఝంప

మానమె భూషణము మానవంతులకు
అని చూచేపట్ల ఆత్మమహారాజ ॥
దిట్టమై కొన్నాళ్లు తిరిగి భూపతిచెంత
నట్టె యవమతి జెంది యది సహించి
పొట్ట సాకుచును నాపురిని మెలఁగుటకంటె
[1]పుట్టులేడై యడవి పొలుచుకేు మేలు ॥ ౧ ॥

కట్టి పరిమళములను గంధవడి కస్తూరి
మట్టుమీారిన పుష్పమాలికలును
కట్టుగను నమ్మ నంగడిలోన మాలికుఁడు
కట్టె లమ్మితే హానిగాదె దేవేశ! ॥ ౨ ॥

అడ్డిలేకను జీవుఁ డభిమతము లొసఁగిన
బిడ్డలను రోయ సంప్రీతి నిపుడు
చెడ్డసుజ్ఞానునికి చేగట్టి నిలువ మనె
దొడ్డ యేనుగ నెక్కి దిడ్డి దూరుదురా ॥ 3 ॥

1. పుట్టిలేడై యడవి పులుచుకేుమేలు.

కాగా జీవరాజు సుజ్ఞానవర్మకు లోకువై తన బిడ్డలమీఁది మోహము మాని నిర్మోహుఁ డై నాఁడయ్యా!

సూత్ర: ఇత్తెఱంగున మాయ పలుకఁగా నా మాటవెంబడినే మోహుఁడు వచ్చే మార్గం.

దరు - రాగం మోహన - తాళం శాపు

మోహుఁడు వెడలె యిదె మహామోహుఁడు వెడలె
మోహుఁడు వెడలెను వింతగా మోహనరాగ మనుకొంట
దేహములను మఱువజేసి తివిరి జనుల వశ్యుల జేయుచు.

సూత్ర: ఇత్తెఱంగున మోహుఁడు వచ్చి యాత్మరాజుకు నమస్కరించి పలికే మార్గం.

ద్వి. నిర్మలాత్మక! విను నిరసించె మమ్ము
మర్మంబు తెలియక మా జీవరాజు
దుర్మంత్రిమణి యైన దుష్టసుజ్ఞాన
వర్మను బట్టి తద్వశ్యుఁ డై నాఁడు
చిడిముడిపడు రాజు చేరువ నున్నఁ
గడగండ్లె గాని సత్కారముల్ గలవె
అలరు సోపద్రవం బగు వృత్తి విడువ
వలె నని పలుకదే వసుధలో నీతి
యటుగాన మేమంద ఱందుండ రోసి
యిటు వచ్చితిమి దయ నీక్షింపవయ్య!

వ: స్వామీ కర్మంబు తప్పింప బ్రహ్మాదుల కైన తరము గాదయ్యా!

సూత్ర: ఔరా యివ్విధంబున పలికిన మోహుని మాటవెంబడినే కర్మశర్మ వచ్చే మార్గం.

దరు - రాగం ఉశేని - తాళం శాపు.

తలను ధోవతి జుట్టి దర్భపవిత్ర
మ్ములు తన యంగుళములను బెట్టి
జలము నించినట్టి ఝారి చేత బట్టి
కలుషహారి యైన కర్మశర్మ వచ్చె

(ఆత్మ): ఏమోయి కర్మశర్మ! సుఖంగా ఉన్నావటవోయి!

కర్మశర్మ:

క. స్వామీ యేమిటి సుఖములు
పామరసుజ్ఞానవర్మ పతి జీవుని ని
ష్కాముని గాఁ జేసి పిమ్మట
మామీఁదను గచ్చగట్టి మము నిరసించెన్.

(సూత్ర): అని పలికిన కర్మశర్మతో నాత్మరాజు పలికేమార్గం.

క. తా వివర మెఱిఁగి సచివుని
భావస్థితిఁ దెలియు రాజు బడయును శుభముల్
కేవలసచివాయత్తత
భూవిభు డొకవేళఁ గీడుఁ బొందించు మహిన్.

వ. కావున జీవరాజు కేవలసచివాత్తుఁడై యున్నాఁడు గనుక నొకవేళఁ బ్రమా
దంబుఁ బొందును. అది యేమోయి ముద్రగలిగిలి.

కర్మశర్మ: స్వామీ సుఖాభిధానుఁడు వచ్చేటట్టు ఉన్నదయ్యా.

సూత్ర: ఇత్తెఱంగున పలికిన కర్మశర్మ మాటవెంబడినే సుఖాభిధానుఁడు వచ్చే
మార్గం.

## దరు - రాగం కాంబోది - ఆదితాళం

సొగసుగా వెడలె సుఖాభిధానుఁ డిపుడు ॥

సొక్కుచు సోలుచును గగురింప మేను కనులు తేలవేయుచు
పగలు రేయి తెలియక పరవశత నొందుచు ॥

సుఖాభిధానుఁడు: శరణు శరణయ్యా స్వామీ!

ఆత్మ: ఏమోయి సుఖాభిధాన! కుశలమా?

సుఖా:

క. పశుపక్షులకును సైతము
సశరీరస్వర్గఫలము సమకూర్చునట
సుశకము సుజ్ఞానుఁడు హా
దశదిశలను జేరనీక తఱిమెను దేవా!

ఆత్మ: వినవోయి సుఖాభిధాన!

క. ధారుణిని హానివృత్తులు
సారెకు మది నెంచిచూడ సమములు సుమ్మీ
ధీరులు మఱి యందులకు వి
చారంబులు సేయఁబోరు సహజముగాఁగన్.

వ. కావున నొక్కవేళ బండ్లు ఓడలను, ఓడలు బండ్లను వచ్చును. జగద్వ్యాపారంబు లిటువంటివి. ఐనా జీవరాజు అధర్మంబు జేసెను, క్రమంబున వశం వదు జేసెద నీవు తలఁకవలదోయి.

సూత్ర: ఇత్తెఱంగున పలికిన సూత్మరాజు మాటవెంబడినే అధర్ముఁడు వచ్చే మార్గం.

క. దుర్మార్గంబులు సేయుచు
నిర్మలమానసులఁ జూచి నిందింపుచు స
త్కర్మములఁ బాఱఁద్రోలుచు
ధర్మప్రత్యర్థి యగు నధర్ముఁడు వెడలెన్.

దరు - రాగం ఉశేని - తాళం శాపు

కాని కార్యములఁ బట్టుచు
దాని గ్రక్కునఁ గొనసాగింపుచు
జోనన్న దెల్లను ద్రోయుచు వెడలె
నన్యాయపథమున నడచుచు ॥ ౧ ॥

సకలసజ్జనులను దిట్టుచు, మూఢ
జనులకు పీడలు బెట్టుచు
వికవిక నవ్వుచు నవ్వుచు వెడలె
విమతుఁ డధర్ముఁడు హెచ్చుచు ॥ ౨ ॥

భాగ: ఓయి! భాగవతులారా! యీ భీషణాకారుఁ డెవఁడోయి? విచారింత మోయి, ఓయి నీవెవరోయి?

అధర్ముఁడు: నేనేరా!

భాగ: నీ పేరేమోయి?

అధర్ముఁడు: ఓరి! వ్యవహారం తప్పి మాట్లాడితే యెవరి పేరెత్తుదురో ఆ పేరురా

భాగ: ఓయి నీ సంకేతం తెలియలేదు, బయలుగా పలకరింపవోయి.

అధర్ముఁడు: ఓరి! వ్యవహారం తప్పి మాటలాడితే అధర్మం చేసె నందురే, కాగా నా పేరు అధర్ముఁడురా.

భాగ: నీవు యిక్కడికి యేల వస్తివోయి?

అధర్ముఁడు: ఓరి! నే వచ్చినభావము తెలియక అడిగినప్పుడే మీకు బుద్ధి లేదురా.

భాగ: ఔనోయి! మాకు బుద్ధిలేనిది సహజమే, నీవు బుద్ధిమంతుఁడవు గదోయి, నీవేమి జెప్పాచున్నావోయి?

అధర్ముఁడు: ఐతే చెప్పేగాని వినండోయి!

దరు - రాగం మంగళకైశిక - తాళం చాపు

నా బుద్ధులు వినుఁడీ, వోరి!
మీ బుద్ధులు యిక మీరు చాలించుఁడీ ‖ నా బుద్ధులు ‖

తల్లిదండ్రుల వెళ్లగొట్టుఁడీ, పెండ్లాల
దైవము లని పూజసేయుఁడీ, పిల్లల
బుద్ధులు ప్రియముతోడ వినుఁడీ
పెద్ద లాడవస్తే పెడతల కరవుఁడీ ‖ ౧ ‖

వెక్కస మైనట్టి వేదశాస్త్రముల
విడనాడి మూలను వేయుఁడీ
కొక్కోకశాస్త్రము లభ్యసించుకోండీ
గుడుగుడు తాగుఁడీ బంగులు బొక్కుఁడీ ‖ ౨ ‖

గుళ్లుగోపురాలు వేళ్లతో పీకండి
గుంటలు బావులు పూడ్చండి
తుళ్లుచు తిరిగే లంజసానులకు
తోరహత్తుగా మిద్దెయిండ్లు గట్టించుఁడీ ‖ 3 ‖

భాగ: నీవు బుద్ధులు చెప్పింది చాలును, నీవు వచ్చిన కార్యం చూడవోయి!

సూత్ర: ఇత్తెఱంగున నధర్ముఁడు వచ్చి యాత్మరాజుతో పలికేమార్గం. శరణు శరణు స్వామీ!

ఆత్మ: ఏమోయి అధర్మ! లెస్సగా ఉన్నావట వోయి!

దరు - రాగం ఘంటారవం - తాళం అట

అధర్ముఁడు :

ఏఁటి లెస్సలయ్యా! యికను మాకేఁటి లెస్సలయ్యా!
మోటు జీవరాజు మూఢసుజ్ఞానుని
మాటలు విని విని మమ్ము పాఱదోలె ॥ ౧ ॥
కాయపురంబున గరళమువలె మించి
దాయాది యైనట్టి ధర్ముఁడు తలయెత్తె ॥ ౨ ॥
కొండెము లంటించి కుటిలుఁడైన సత్యుఁ
డుండి యుండి మా యునుకుల గలచె ॥ ౩ ॥
దేవర మాకెల్ల దిక్కని వచ్చితి
జీవుని మీరింక శిక్షింపకున్న ॥ ౪ ॥

ఆత్మ : వినవోయి యధర్మ! అటువలనే జీవునికి తగిన బుద్ధి జెప్పుచున్నావోయి!

సూత్ర : ఇత్తెఱంగున నాత్మమహారాజు పలికిన మాటవెంబడినే బుద్ధిదేవి వచ్చే మార్గం.

ద్వి. కామతంత్రంబులఁ గపటమార్గములఁ
బామరకథలను బహుదురాశలను
రసవాదములను జౌర్యప్రసంగములఁ
బొసగంగఁ గాంక్షలఁ బొడమ సేయుచును
జలదమాలికరీతిఁ జపలతతోనఁ
బొలుపొంది తామసబుద్ధి తా వెడలె ॥ ౧ ॥

దరు - రాగం ఆహరి - ఆదితాళం

మగఁడు చేబట్టి యేలని మానిని బతు కేలనే, ముద్దుగుమ్మా!
తగఁ జంద్రుఁ డేలని రేయి తామస(ము)గదవమ్మా! ఓ ముద్దుగుమ్మా!
సవతిని పలకను రాసినా చలము సాధించకుండునా, ముద్దుగుమ్మా!
శివ శివ సాత్త్వికబుద్ధి జీవేశు బోధించె నమ్మా, ముద్దుగుమ్మా!

దరు - రాగం గుమ్మకాంబోది - ఆదితాళం

మెరుగు సొమ్ములను బెట్టి, జారుకొప్పున
విరిసరములను జుట్టి, విరిబోణి యెదఁజేరుచు
తామసబుద్ధి వెడలె జీవుని దూరుచు ॥ ౧ ॥
కులుకు గుబ్బలు నీరగా
జిలుగు పయ్యెదకొంగు తొలఁగి జారగా
జలదమాలికజాడగా
వెడలె హాయిలుగ జనము లెల్లను జూడగా ॥ ౨ ॥

సూత్ర: ఇత్తెఱంగున తామసబుద్ధికాంత వచ్చి మాయాదేవికి మొక్కఁగా, మాయాదేవి "ముప్పు ముత్తైదువగా ఉండమ్మ" ని దీవించి తన కుమారులైన కామక్రోధమదమాత్సర్యాఖ్యులు రాలేదని దద్దిల్లి వద్ద నుండే బుద్ధికాంతాదుల జూచి పలికేమార్గం.

దరు - రాగం ధన్యాసి - ఆదితాళం

జగముల నైదు శరమ్ముల గెలిచిన చక్కని గాముని గానరా ॥ ౧ ॥
యోగి హాలాహలవహ్నివదనుని మహోగ్రుని క్రోధుని గానరా ॥ ౨ ॥
తన ప్రాణమునకు కాసుకు లంకెగా తలఁచే లోభుని గానరా ॥ 3 ॥
మునుకొని దేహము తెలియగా నియ్యని ముద్దు మదాఖ్యుని గానరా ॥ ౪ ॥
యావజ్జీవము పగ వదలగనీయని మాత్సర్యుని గానరా ॥ ౫ ॥
ఈ విటఘాతుకకృపణమత్తమత్సరహితు లగు వారిని గానరా ॥ ౬ ॥

సూత్ర: అని పలికిన మాయాదేవిని జూచి బుద్ధిదేవి పలికేమార్గం.

క. భీకరుఁ డగు [1]సుజ్ఞానుని
జేకొని వైరంబు కీడు జేసినగానిఁ
నీ కడుపు చలువచేతను
నీ కొడుకుల కరులపీడ నిలువదు కొమ్మా!

1. సుజ్ఞానుఁడు.

సూత్ర: అని పలికిన బుద్ధిదేవిని నాత్మమహారాజును బొడగనిపించి మాయాదేవి యాత్మరాజుతో పలికేమార్గం.

దరు - రాగం పంతువరాళి - ఆదితాళం

బ్రతికించుమీ సామి! బ్రతికించుమీ ॥ ప ॥
అతిదీనుల మైన మ మ్మాత్మమహారాజ! ॥ అనుపల్లవి ॥
పరదేశుల మై పరులపంచల దిశలను
తిరుగుచున్నాము కృపాదృష్టిచే మ మ్మీవేళా ॥ ౧ ॥
చంటికూనలఁ బాసి జాలిజెందుచున్నాను
కంటికి నిదురరాదు కరుణించి మమ్మేల్లను ॥ ౨ ॥
చెదరిన కాపురము చేకూర్చి రక్షింపుము
సదయుఁ డైన దేవరే శరణని వచ్చినాము ॥ ౩ ॥

సూత్ర: అని పలికిన మాయాదేవిదీనవచనంబు లాలకించి యాత్మమహారాజు మోహుని జూచి పలికేమార్గం.

ద్వి. వినవోయి మోహా! ఈ విశ్వంబులోన
జనపతు లహితుల సాధింపఁ గోరి
చారుల నంపించి శాత్రవపురిని
వారి బలంబులు వారి నిల్కడలు
వారి మంత్రంబులు వారి తంత్రములు
తీరుగాఁ దెలిసి వర్తింతురు గాన
ఒరిమతో మోహనయోగి వై నీవు
సరసజీవప్రభుసముఖంబుఁ జేరి
వినిపించి సభమెచ్చ విద్యల నెల్ల
దినదినప్రేమ వర్ధిల్ల నందుండి
దేహపురస్థితిఁ దెలుసుకోరమ్మి!
ఊహించి మటమీఁద నుచితకార్యములు

సూత్ర : ఇత్తెఱంగున నాత్మమహారాజుని యోగంబున మోహుఁడు మోహన యోగివేషంబుఁ గైకొని గాత్రపురంబునకుఁ బోవ నుద్యుక్తుండై యుండు నవసరంబున [1]ననంతరకథాసంవిధానం బెటువలె నంటేను - గాత్రపురాధీశ్వరుం డైన జీవమహారాజు కొలువుకు వస్తున్నాఁ డని హెచ్చరిక దెలుప ధర్ముఁడు వచ్చేమార్గం.

దరు - రాగం మధ్యమాది - ఆదితాళం

ధర్ముఁడు వచ్చెను సన్మార్గమున - ధర్ముఁడు వచ్చెను.
కోరిన యర్థికి కలకొద్ది లోభించక నే స ॥
త్కారములు సేయుమని సారెసారెకు దెలుపుచు ॥ ౧ ॥
తల్లిదండ్రులు ప్రత్యక్షదైవము లని యెంచుఁడీ
తుల్లెడి దుష్టజనులతోడ పల్కవద్దనుచు ॥ ౨ ॥

వ : ఓయి సభాజనులారా ! జీవమహారాజు కొలువుకు వస్తున్నాఁడు హెచ్చరికగా ఉండండోయి !

సూత్ర : ఇత్తెఱంగున ధర్ముఁడు వచ్చి హెచ్చరిక దెల్పిన తదనంతరంబున గాత్రపురాధీశ్వరుం డగు జీవమహారాజు నిజసభకు వచ్చేమార్గం.

క. భావించి సకలజగములఁ
గేవలమృగతృష్ణ లనుచు గీర్తింపుచుఁ దా
దేవుని భజనము జేయుచు
జీవమహారాజు వచ్చెఁ జిత్రముగాఁగన్.

దరు - రాగం కనడ - ఆదితాళం

జీవమహారాజు వచ్చెను శివుని దలంచుచు ॥ పల్లవి ॥
తీవరముగా నింద్రియతురంగముల
దెలిసి కవులను కట్టుం డటంచు ॥ అనుపల్లవి ॥

---

1. అంతట.

వరుసను తొమ్మిది వాకిండ్లను, రిపు
వర్గములను రానీయకుఁడీ
పెరిగెడి యాశావిమలతికాతతి
పెల్లగించి కడతోయుఁ డటంచు ॥ ౧ ॥

కూరిమితో షట్చక్రదుర్గముల
గురుతుగ శోధించుకోరండి
మీరిన భక్తిప్రముఖాంగనలను
మెదలనీక రక్షించుఁ డటంచు ॥ ౨ ॥

సూత్ర : ఇత్తెఱంగున జీవమహారాజు హృదయసౌధాంతరంబున కొలువై యుండి చిత్తశర్మను బిలువ మనఁగాఁ జిత్తశర్మ వచ్చేమార్గం.

క. మీరక పెద్దలమాటల
దూరక దుష్పథములందు దొర జీవునికిన్
సారెకు నభ్యుదయంబును
గూరుతు నని చిత్తశర్మ గొబ్బున వచ్చెన్.

దరు - రాగం కేదారగౌళ - ఆదితాళం

చిత్తశర్మ వచ్చె ముదము రెట్టింపగ, జీవరాజుసభకు
ఉత్తమ మైన యభ్యుదయము రాజుకు
నూహింపుచు కార్యభాగము లెన్నుచు ॥ అనుపల్లవి ॥

గరిమెను తానె బంధమోక్షములకు కారణ మని పలుకుచు
దొరసిన సకలజగమ్ములు తనవల్ల తోఁచుచున్న దనుచు మెచ్చుచును ॥ ౧ ॥

జీవరాజు : ఓయి చిత్తశర్మా! కూర్చుండవోయి సమాచారము లేమోయి ?

(చిత్తశర్మ) : పలికెద వినవయ్య !

ద్వి. సనయ! వివేకభూషణ! జీవరాజ!
మనచేత జితులైన మాయాదు లిపుడు
చండకోపానలజ్వాలలు బరువఁ
బుండరీకపురంబుపొంతకుఁ బోయి
యాత్మమహారాజు కన్నియుఁ దెలుప
నాత్మ వారల కెల్ల నభయంబు లిచ్చి
ఖేదించి భృత్యులఁ బిదప మీతోన
వాదంబుఁ గావించి వారి మీవద్ద
నిలుప నున్నాఁడని నిన్న మాప్రొద్దు
వలనొప్ప నే గాలివార్తగా వింటి.

జీవరాజు: వినవోయి చిత్తశర్మా! నీవు గాలివార్తగా విన్నప్పుడే నిలువరముగా తోస్తున్నది. అది యెట్లంటేను.

క. ఇల నల్పశత్రువైనను
బలవంతులఁ జేరిరేని పార్థివుఁ డపుడున్
తలఁపవలెఁ దగు నుపాయ
[1]ములనేమరి యుండెనేని మోసము వచ్చున్.

కాఁగా ఇందుకుఁ దగిన మంత్రాలోచన సేయవలెను, సుజ్ఞానవర్మను పిలుపించవోయి!

సూత్ర: ఇత్తెఱంగున జీవరాజు సుజ్ఞానవర్మను బిలువ మనంగా సుజ్ఞానవర్మ వచ్చే మార్గం.

క. సుజ్ఞానవర్మ వచ్చెను
బ్రజ్ఞాధికు లెల్లఁ దనకుఁ బ్రణతు లొనర్పన్
తజ్ఞారాధితుఁడై ధర
నజ్ఞానతమంబు లెల్ల నటునిటు దొలఁగన్.

1. ములనేమర్యుడే నతిమోసము వచ్చెన్,

దరు - రాగం అసావేరి - అటతాళం చాపు

వచ్చెను సుజ్ఞానవర్మ, వచ్చెను
మునియోగవరులు భజింపగ
అజ్ఞానపటలమహాంధకారరవి
తజ్ఞార్జితనిధితత్వాంజనము ॥ ౧ ॥

జీవరాజు: రావోయి సుజ్ఞానవర్మ! సమాచార మేమోయి?

సుజ్ఞానవర్మ: పలికెద వినవయ్యా!

క. మునుకొని యాత్మమహారా
జును శర ణని మాయ మోహసుతుతో మనతో
నని సేయఁ దలచియున్నది
యని వింటిని నిశ్చయముగ [1]నాప్త ముఖమునా.

జీవరాజు: వినవోయి చిత్తశర్మ! నీవు గాలివార్తగా విన్నమాట నేను నిశ్చయమా నన్నందుకు సుజ్ఞానవర్మ వచనము తార్కాణాయె గదోయి.

సూత్ర: ఇత్తెఱంగున జీవరాజాడిన మాటతోకూడ నిశ్చయాఖ్యుఁడు వచ్చేమార్గం.

క. రచ్చలను బూర్వపక్షముఁ
జెచ్చెర సిద్ధాంతములను సేయుచుఁ దనలో
ముచ్చట లాడుచు మెల్లనె
వచ్చెను నిశ్చయుఁడు సుజనవరులు నుతింపన్.

దరు - రాగం శంకరాభరణం - తాళం........

నిశ్చయాఖ్యుఁడు వచ్చెను హాయిలు మీర
నిశ్చయాఖ్యుఁడు వచ్చెను ॥ అనుపల్లవి ॥
సకలయోచనలను సంభవించిన యట్టి
వికలసంశయముల వేగమె దీర్చుచు

1. నాప్తముఖంబునా.

జీవుఁడు: ఓయి నిశ్శ్రేయాఖ్య! నీవు వచ్చినప్పుడే సకలసంశయములు తీరును.

సూత్ర: ఇత్తెఱంగున జీవమహారాజు మితపరివారంబుతోఁ గొలువైయుండు నవస రంబునఁ బుండరీకపురంబునుండి మోహుఁడు మోహనయోగివేషంబుఁ గైకొని జీవమహారాజుసముఖానికి వచ్చేమార్గం.

సీ. జిగినింపు జడగుంపు శిరమునందునఁ జుట్టి
  తులకించు బెబ్బులి తోలు గట్టి
మొనసి నానావశ్యమూలిక చేఁగట్టి
  గిలుకు బంగారుపావలను మెట్టి
నిగ్గుమీరిన యట్టి నెమలిపింఛముఁ బట్టి
  పొలుచు నెత్తిని కావుబొట్టు బెట్టి
జోకతో బిరుదులు డాకలి నమరించి
  తనరారు సకలమంత్రముల మించి

గీ॥ యొనర విద్యల సా(మ)గ్రులను వహించి
వేత్రము ఘటించి [1]యారక్తనేత్రుఁ డగుచు
సారెసారెకు నిల్చి [2]మజ్జారె యనుచు
[3]యోగు లరుదంద మోహనయోగి వెడలె.

—: దరు :—

యోగి వచ్చెను మోహనయోగి వచ్చెను
యోగపట్ట(ము) మేన దనర నాగరికముగను మోహన ॥ అనుపల్లవి ॥

రెండుచెవుల వెలయు రుద్రాక్షకుండలములతో
నిండు భూతిపూత మేన నిగ్గుమీర జగ్గునను ॥ ౧ ॥

ఒరవు విద్యలకును నేనే [4]యొజ్జ యనుచును
బిరుదుమాట లాడుకొనుచు బిగువు నగవు జిగుగినింప ॥ ౨ ॥

మేలిమైన నెమ్మిపింఛ(ము) మినుకు లీనఁగ [5]కేలమ్మ్రోన
వాలు బూని శూలిపోలి గాత్రపురి కిపుడు ॥ 3 ॥

1. యారక్తనేత్రుఁడగుచు. 2. మసార. 3. యోగులరుదంద.
4. వోసలనుచును. ౫. కేలమునమ్మ్రోన.

ద్వారపాలకుఁడు: ఎవరోయి నీవు?

(మోహనయోగి): అరుణగిరియోగిభక్తుఁ డైన మో(హ)నయోగి నోయి!

(ద్వారపాలకుఁడు): ఇచటికి యేల వస్తివోయి?

(మోహనయోగి): జీవమహారాజు మహాకవి గనక యతనిముందర నే నేర్చిన విద్యలు జూప వస్తినోయి. జీవమహారాజుతో నే వచ్చినా నని చెప్పవోయి!

(ద్వారపాలకుఁడు): మంచిది యిక్కడ వుండవోయి!

సూత్ర: ఇత్తెఱంగున ద్వారపాలకుఁడు పోయి జీవరాజును జూచి పలికేమార్గం.

(ద్వారపాలకుఁడు): స్వామీ! మన కోటవాకిటను మోహనయోగి యని యొకఁడు వచ్చియున్నాఁడు. సకలమంత్రయంత్రజ్యోతిశ్శాస్త్రాదులు తనకు వచ్చును, తాను చెప్పే ప్రశ్నలు తప్ప దని ప్రతిజ్ఞ చేస్తున్నాఁడయ్యా!

చిత్తశర్మ: స్వామి! మనయోచన కనురూపంగా మోహనయోగి వచ్చినాఁ డని విన్నప్పుడే మన అదృష్టఫలం లెస్సా ఉన్నదయ్యా!

సూత్ర: ఇత్తెఱంగున చిత్తశర్మమాట వెంబడినే అదృష్టుఁడు వచ్చేమార్గం.

దరు - రాగం భైరవి - తాళం ఆది

వచ్చె నదృష్టశర్మ హాయిలు మీర
ముచ్చటగా తను ముజ్జగము నుతింప ॥
ఇక నేటి ఉద్యోగ మిక నేటి ధనలాభ
మిక నెట్టి కార్యము లిక నేడ దనుచు
వికలాత్ములై యుండువేళ నద్భుతముగ
సకలఫలంబులు సమకూర్చి యిచ్చుచు ॥ ౧ ॥

జీవరాజు: రావోయి అదృష్టశర్మ! కూర్చుండవోయి!

సూత్ర : ఇత్తెఱంగున అదృష్టశర్మ వచ్చిన తదనంతరంబున చిత్తశర్మ జీవరాజాను మతంబున మోహనయోగిని పిలువ మనఁగా మోహనయోగి వచ్చే మార్గం.

దరు - రాగం – ? - తాళం – ?

[1]మంత్రవాది యోగి వచ్చెను మోహనయోగి వచ్చెను

సూత్ర : ఇత్తెఱంగున మోహనయోగి వచ్చి జీవరాజును జూచి పలికేమార్గం.

క. అజభార్యాహిమగిరిసుర
గజహంసాంభోధిశంఖకైలాససుధా
రజనీకరయశ సంగర
విజయీ భవ జీవరాజ విశ్రుత తేజా !

అని పలికిన మోహనయోగిని జూచి, సుజ్ఞానవర్మ - "సత్యమస్తు వచస్తవ".

సూత్ర : ఇత్తెఱంగున పలికిన సుజ్ఞానవర్మ మాటవెంబడినే సత్యాఖ్యుఁడు వచ్చే మార్గం.

(రాగం........) ఆది తాళం.

నిత్యముగ లోకములు నేనే సాధింతు ననుచు
సత్యుండు వచ్చెను సకలజనులు పొగడగ
నన్ను నమ్మినవారు లున్నతుల మంజుళకీర్తిసం
పన్ను లగుదు రని [2]మిగుల పంతగింపుచు

సూత్ర : ఇత్తెఱంగున సత్యాఖ్యుఁడు వచ్చిన తదనంతరంబున మోహనయోగిని జూచి చిత్తశర్మ - వినవోయి ! మోహనయోగి ! నీరాక యీ సభవారి కెల్ల నానందమును ఘటించు నోయి !

సూత్ర : ఇత్తెఱంగున పలికిన ఆ చిత్తశర్మ మాటవెంబడినే ఆనందుఁడు వచ్చేమార్గం.

1. మత్తవాలి. 2. నిగుల పత్తగింపుచు.

దరు - రాగం ఆనందభైరవి - తాళం చాపు

ఆనందశర్మ వచ్చెను వేడుకతో ॥
ఎలమి శోకాదు లెల్లఁ దొలఁగఁజేసి పరవశుఁ డై
పొలిచి తనకు తానె యుప్పొంగి పొఁగి నవ్వుకొంట.

సూత్ర : ఇత్తెఱంగున నానందుండు వచ్చిన తదనంతరంబున జీవరాజానుమతంబున చిత్తశర్మ మోహనయోగిని జీవరాజుసముఖంబున విద్యలను విన్నవించ మనఁగా మోహనయోగి విద్యలను విన్నవించేమార్గం.

దరు - ఆదితాళం

గీతవాద్యనటనములు వైద్య
ద్యూతానుకరణకవనములు లిపి
జాతిరత్నరూప్యపరీక్షలు
సాముద్రికము లిన్ని దెలుసును వినవయ్యా
సభ నన్ని ప్రత్యేకముగా నాడి జూపెదనయ్య ॥ ౧ ॥

గారుడ మింద్రజాలము కృషి
చోరత్వము చప్పుడువిద్య శుక
శారికాభాషావిజ్ఞాన మగ్ని స్తంభనము ॥ ౨ ॥

వాణిజ్యపశుపాలెములు హయ
వారణరథారోహణాలు వేణు
వీణావాద్యాలు ధనుర్విద్య దొమ్మరివిద్య లిన్ని ॥ 3 ॥

కొక్కోకమల్లయుద్ధములు మేష
కుక్కుటలావుకయుద్ధములు వేట
చక్కని చిప్పశకునపరిజ్ఞానము లిన్ని ॥ ౪ ॥

పరకాయప్రవేశము నానా
భాషాపరిజ్ఞాన మదృశ్య
కరణవక్రసూత్రక్రీడా ఘన మైన భటాంగము లిన్ని ॥ ౫ ॥

శిరణి చిత్రనిర్మాణములు కచ
భారసుమగ్రథనచమత్కృతులు గంథ
సారశుచిపుస్తకవాచనదేశకథనము లిన్ని ॥ ౬ ॥

శరధర్మమును రాజనీతి జ్యోస్య
శకునవహ్నిలోహపరీక్ష కత్తి
పరిచి సాము మహాదేవపట్టణమహిమము లిన్ని ॥ ౭ ॥

కనకతురగపరీక్షలు వ్యా
కరణగదాసాధనములు తర్కమును మహా
భారతమును మహాదానము లిన్ని ॥ ౮ ॥

[1]బిరుదెక్కు లోహచక్రగతులు కవడి
విరుదులుకును హాస్యవిద్య జగతి
సరస మైన ధర్మశాస్త్రవిధిజ్ఞానము లిన్ని ॥ ౯ ॥

జీవుఁడు : వినవోయి మోహనయోగి! నీవు మహాజాణవోయి! నీవు చెప్పిన విద్య లద్భుతములు, మాకు చూడవలె నని కౌతుకంగా ఉన్నది. ఆడి చూపవోయి!

(మోహనయోగి) : ఐతే చూడవయ్యా!

సీ. వీరభద్రా! నీవు వెనుబలంబుగ నిలువు
పరతంత్రముల కోట భద్రకాళి!
కాలభైరవ! నీవు కవచమై పాలించు
మలయాళభగవతి! మమ్ముబ్రోవు
తోడరి కుట్టిచ్చాతి! తోడునీవై రమ్ము
బుద్ధి గలుగనేయు పోతురాజ!
చండి! కాటేరి! [2]నీ చేతుల నందిమ్ము
మాతృకోల నుండు మా పెడారి

1. బిరదంగి. 2. నా చండుల.

గీ॥ దయ్యములతోడ వచ్చి భేతాళ! నీవు
ఖలుల వాదుల వాకట్టు కట్టవయ్య
విద్యలాడేటిపట్లను విజయ మిమ్ము
ముంగల వసించి మాగురులింగమూర్తి.

(విద్య లాడేది)

సూత్ర : ఇత్తెఱంగున మోహనయోగి విద్య లాడఁగాఁ జూచి జీవరాజు అద్భుత మంది పలికే మార్గం.

జీవుఁడు : వినవోయి మోహనయోగి!

క. [1]వయసా కొంచెం బీయతి
[2]శయవిద్యల నభ్యసింపఁ జాలదు యుగ మే
క్రియ నేర్చితి వీ విద్యల
దయతోడుతఁ దెలుపవయ్య తథ్యము గాఁగన్.

సూత్ర : అని పలికిన జీవరాజును జూచి మోహనయోగి పలికే మార్గం.

ద్వి. విను జీవరాజ నా వృత్తాంత మెల్ల
జననంబు మొదలు సత్సంగతి జేసి
మసలక దేహాభిమానంబు విడిచి
యసమాన మగుముక్తి నందగఁ దలఁచి
మండెడి పంచాగ్నిమధ్యంబునందు
రెండు బాహువు లెత్తి [3]రేపగల్ తపసు
దరిసేయ శివుఁడు ప్రత్యక్షమై వచ్చి
వరము కొమ్మన్నను వదలక ముక్తి
నిమ్మన్న లేదు నీ కీ యాశ్రమమున
నెమ్మి [4]గృహస్థుఁడై నిఖిలధర్మములు

1. వయసా కొంచం వియతి. 2. శయ విద్యల నభ్యసింపఁగ చాలదు యుగమే.
3. రేపగలు తమపు. 4. గృహస్థవై.

సాధించి యామీఁద సత్సంగమాది
సాధనంబుల ముక్తి సాధింతు ననుచు
నీశుఁ డిచ్చెను విద్య లిన్ని కన్యకుగా
దేశ మేకాకి నై [1]తిరుగుచున్నాను
[2]భువి (గల్గు) సాధనంబుల రాదు ముక్తి
శివకటాక్షము లేక సిద్ధంబుగాను.

అని మోహనయోగి పలికిన జీవుఁ డాత్మగతంబున :—

క. కృపఁజేసి భర్గుఁ డీ ముని
నెపమునఁ దా నిందు వచ్చె నే మని గురువై
యుపదేశము గావించును
దప మొనరించెద మనోరథము లీడేరన్.

అని తలంచి చిత్తశర్మను జూచి (ప్రకాశం ఆ పద్యమే) వినవోయి చిత్తశర్మా! అన్ని సాధనము లున్నప్పటికిన్ని శివప్రసాదం లేక ముక్తి ఘటించదు. కావున తపము జేసెద, నే నెచ్చట నాజ్ఞాపించి నిల్పినానో అచ్చట కదలక భద్రముగ ఉండండోయి!

సూత్ర : ఇత్తెఱంగున పలికిన మోహనయోగికి సకల బహుమానములు జేసి యెంచి ధ్యానైకమనస్కుఁడై యుండ, నంతట కథాసంవిధానం బెటువలె నంటేను, ఆత్మమహారాజు మోహనయోగిముఖంబున జీవరాజుచర్య విని యతని తపంబునకు మెచ్చి గౌరీసమేతుఁ డై వృషభవాహనారూఢుం డై మాయాదుల కూర్చుకొని జీవరాజుకు ప్రత్యక్షమయ్యే మార్గం.

ద్వి. చిన్నిక్రొన్నెల పూవు శిరమునఁ దనర
మిన్నేరు జడలను మెలఁగుచు నుండ
బురణించు సితభూతిపూఁత నెమ్మేని
విరికాంతుల తోన వియ............
పులితోలు కటితటిఁ బొందుగాఁ గట్టి

1. తిరుగుచున్నాఁడు. 2. భువిసాధనమ్ముల రాదుముక్తి

వలగు.........మనవాలు చేబట్టి
మణిభోగవితతుల మలయు (చు నుండ)
ఫణిరాజహారసత్ప్రభ లుల్లసిల్ల
సకలవేదంబులు సకలశాస్త్రములు
సకలపురాణముల్ సకలమంత్రంబు
లనుపమాగమచయ మణిమాదు లెల్ల
మునుకొని సేవింప మూర్తీభవించి
గరుడపన్నగయక్షగంధర్వసిద్ధ
పరమమునీంద్రసుపర్వులు గొల్వ
మనవులు దెలుపుచు మాయాదు లెల్ల
వినయభక్తుల మించి వెంబడి రాఁగ
మెండైన కోవల మిక్కిలి దనరి
వెండికొండను వోలు వృషభంబు నెక్కి
కరిముఖశరజన్మగౌరులతోడ
పరమాత్ముఁ డప్పుడు ప్రత్యక్ష మయ్యె.

దరు - రాగం శంకరాభరణం - ఆదితాళం

పరమశివుఁడు వచ్చెను హాయిలను

కరుణాసుధ లిరుకన్నుల తుదలను ॥
పరిపూర్ణంబుగ ప్రవహింపగను ॥ అనుపల్లవి ॥

చండికేశ్వరుఁడు నంది చామరములు వేయఁగ
గుండోదరుఁడు ముత్యాలగొడుగు బట్టగ
పుండరీకాక్షుఁడు ధాత పొందుగా మనవి సేయ
దండను నిర్జరతండముతో నా ఖండలుండు కైదండ లొసంగ.

సూత్ర : ఇత్తెఱంగున వచ్చిన పరమేశ్వరుని గనుఁగొని జీవరాజు దిగ్గున లేచి మొదలొగి సాష్టాంగంబుగా వందన మాచరించి పులకాంకితశరీరుండై స్తోత్రం జేసేమార్గం.

### దరు - రాగం పూర్వి - తాళం అట

పురహర ! మాం పాహి సదాశివ ! పురహర ! పాహి

ముక్తిం ప్రదేహి మరుదాధార !
మహోరగహార కేయూర ! మహోదార ! ॥ ౧ ॥

గోత్రనివేశ ! గురుభయనాశ !
చిత్రపవిత్రచరిత్ర ! త్రినేత్ర ! కళత్రవద్గాత్ర ! ॥ ౨ ॥

నతజనపాల ! నయగుణశీల !
జితమీనాంక ! కళంకగలాంక ! వృషాంగనిషంగ ! ॥ 3 ॥

సూత్ర : ఇత్తెఱంగున స్తోత్రంబు జేసిన జీవరాజును జూచి సంతుష్టుం డై

### దరు - రాగం కాంబోది - తాళం చాపు

(పరమేశ్వరుఁడు) : నేమమా నీకు నిన్ను జేరినవారికి జీవరాజ !

(జీవుఁడు) : మాకు, నేమము యికమీద చేకూర్చుమీ దయ దేవదేవ !

(పరమేశ్వ) : మాదయనే నీకు మహితసంపదలు జీవరాజ !

(జీవ) : నేను కాదనలేను ఈ కలుము లస్థిరములు ॥ దేవదేవ ॥

(పరమేశ్వ) : తనువు ముఖ్యసాధనము మోక్షమునకు జీవరాజ !

(జీవ) : ఈ తనువు నీటిబుడగ దాని తత్వము జూడ, దేవదేవ !

(పరమేశ్వ) : సారమ్ము సుమ్మి సంసార మిన్నిటిలోన జీవరాజ !

(జీవ) : సంసారము మరి నిస్సార మెంచిచూడ దేవదేవ !

(పరమేశ్వ) : మాయాజ్ఞ నుండుట మర్యాద గద ! నీకు జీవరాజ !

(జీవ) : సామి ! మీ యాజ్ఞ నోకింత మీర నాతరమె దేవదేవ ! ॥ ౪ ॥

సూత్ర: ఇత్తెఱంగున జీవపరమాత్మలు పలుకుచుండుసమయంబున పరమాత్మ
నేత్రసంజ్ఞను మాయ తన కిది సమయం బని మెల్లనె యొదిగి యొదిగి
జీవరాజుచెంతఁ జేరి పలికేమార్గం

రాగం ? - తాళం - చాపు

(మాయ): నావల్ల సంపదలు సదనముల నందనులను సతుల సామి!
నీవు పొందలేద నామీద నూరకే నేర మెంచతగునా ॥ ౧ ॥

(జీవుఁడు): కేవలచిన్మయుఁడ సర్వజ్ఞుఁడ
పావనుఁ డవ్యయుండ మాయ!
నీవల్ల జననాదిఖేదము లందితి
నీపొందు చాలు పోవే, ఓ మాయా! ॥ ౨ ॥

(మాయ): నా పొందువల్ల నీకు పురుషుఁ డనే
నామధేయము గలిగెను - భువి
నేపున నిదిగాక కర్త భోక్త వైతి
వీమేలిమి మరతురా జీవరాజా ॥ ౩ ॥

(జీవ): మరపు లేదు గనకే నీ విచ్చిన
మలినసంపద లెల్లను త్రోసి
సరసముగా విద్యార్జిత మగు ముక్తి
సంపద కోరెదనే ఓ మాయ! ॥ ౪ ॥

(మాయ): కోరినంతవరకు నీవు నాతో గూడి
కుతుకముతోడుతను - మేను
పూరింప నిహలోకపరలోకసుఖములు
పొందుచు తిరుగలేద ॥ ౫ ॥

(జీవ): పొందిన సౌఖ్యములు చాలు చాలు
బూమెల నన్నంటకు వే సర్వనిందితములు గదే
నీ విలాసములు నీవు నన్నెలయించకె - ఓ మాయ ! ॥ ౬ ॥

(మాయ): ఎలయించి పలుకకుమీ ! ఆడ దని
ఈశ్వరుసన్నిధిని - సామి !
పలుమారు నేను నీ యిల్లాలు గా నని
బాస నేయనేర్తువా - జీవరాజ ॥ ౭ ॥

సూత్ర: ఇత్తెఱంగున మాయాజీవుల వాగ్వాదంబులు విని సుందరవదనారవింద మందస్మితుం డగుచు నిందుకలాభరణుండు జీవరాజును జూచి పలికేమార్గం.

ద్వి. జీవరాజన్య ! యీక్షితితలంబునను
భావించి సుజ్ఞానపరు లైనవారు
సకలధర్మంబులు సకలకామ్యములు
సకలపుణ్యములు మోక్షము లీలగాఁగ
నార్జింతు రీ గృహస్థాశ్రమంబునను
వర్జించి పాపాదివర్గంబు నెపుడు
మురు వైన గార్హస్థ్యమున నుండి మమ్ము
మరువక చిత్తంబు మాయెడ నుంచి
తపము సర్వేంద్రియదమ మని యెంచి
జపము సత్యం బని సంధించి మదిని
తోయజపత్రాంతతోయంబురీతి
మాయతోడుత గూడి మాయకు వెలిగ
నుండుము నీవె మే మూహించి చూడ
దండిగా తను దెలియఁ దానె పో బ్రహ్మ
మాయాజ్ఞ మీరక మాకు వేడుకలు
పాయక చెల్లించు భక్తితోడుతను.

సూత్ర: ఇత్తెఱంగున పలికిన పరమశివుని జూచి జీవరాజు పలికేమార్గం.

క. దేవరమాటలు కాదన
నావశమా చెప్పినట్లు నడచెద నింకన్
కేవలము నిత్యముక్తుని
గావింపుము వరము లిమ్ము కారుణ్యనిధీ!

పరమేశ్వరుఁడు: వినవోయి జీవరాజ! సంసారములో నున్నప్పటికిన్ని పూసలలోని దారమువలె నిస్సంసారి వై నిరామయుండ వై వుండవోయి!

సూత్ర: (ఇత్తెఱంగున) జీవరాజును సమాధానముజేసిన పరమేశ్వరుని జూచి మాయాదేవి పలికేమార్గం.

ద్వి. అవధారు పరమేశ! యద్రిజాధీశ!
భవభవభయనాశ! భవ! చిత్ప్రకాశ!
కొడుకు కోడలివల్ల కులవృద్ధు లెల్ల
కొడుకుకు పెండ్లి సేకున్న నేరీతి
వెలయును వంశంబు విఖ్యాతిగాను
దలఁప నీరీతి పెద్దలు పల్కఁ విందుఁ
గావునఁ బెండ్లి మాకాముని కిపుడు
గావించి రక్షించు కరుణాపయోధి!

సూత్ర: ఇత్తెఱంగున మాయాదేవి పలికిన మాట విని పరమేశ్వరుఁడు జీవరాజును జూచి కాముని పిలుపించ మనఁగాఁ గాముఁడు వచ్చేమార్గం.

సీ. అలినారి బిగియించి నంటివిల్లు ధరించి
కలువపూదుప్పటిఁ గటి ఘటించి
పొగడపూవుల దట్టి బిగువు మించగ గట్టి
మొగలిపూజముదాడి మొలన జెక్కి

కొండగోంగులపూల కుళ్లాయి తలబెట్టి
మొల్ల మొగ్గల హారములను బూని
బొండుమల్లెల యొంట్లు పొల్పువీనుల మించ
తమ్మికెడయము కాంతి తగ వహించ

తే. రాజసంబున రాజిల్కు తేజి నెక్కి
పరఁగ నిరువంక కోకిలభటులు పొగడ
మురువుఁ గనుఁగొని మోహింప ముజ్జగములు
వచ్చె వలరాజు కల్యాణవార్తతోన.

రాగం - ? - తాళం ఆది

[1]వలరాయఁడిదె వచ్చెను హాయిలు మీర ॥ పల్లవి ॥

మీరిన కోకిలములు మారులేని తుమ్మెదలు
శారికాతతులు మదకీరములు వెంటరాఁగ ॥ ౧ ॥

[2]మంతు కెక్కిన చంద్రవసంతులతో ముచ్చటలు
సంతసమున నాడుచుఁ బంతముతోడ హాయిలుగ ॥ ౨ ॥

ఆసల నెమ్మది సుమవాసన గుభులుకొన
జేసరములతో నునుమీసము వడివేయుచు ॥ 3 ॥

సూత్ర : (ఇత్తెఱంగున) కాముండు వచ్చి సోమశేఖరునికి వందనము సేయఁగ "పెండ్లికొమారుండవు గమ్మని" దీవించి పరమేశ్వరుండు జీవరాజును జూచి పలికేమార్గం.

---

1. వరలాయండిదె.
2. మత్తు.

ద్వి. పున్నమచందురు పోలిక న్నుండె
కన్నులవిల్లల [1]కంతుని కింక
కన్నియ దెచ్చి సుఖస్థితి పెండ్లి
జెన్నుగ సేయుము జీవనృపాల !

జీవ: క. భావజుని కైన కన్యక
భూవలయమునందుఁ గానఁ బోలఁతులలోనన్
దేవరచిత్తం బిక నీ
భావజు భాగ్యంబు సర్వభర్తార్తిహరా !

సూత్ర: అని పలికిన జీవరాజువాక్యంబు లాకర్ణించి యిందుకలాధరుండు మందస్మితుండై మాయాదేవిని జూచి మన[2]రతీకన్యను దోడితెమ్మనగా రతీదేవి వచ్చేమార్గం.

ద్వి. చలువపన్నీటను జలకంబు లాడి
చెలువైన చెంగావిచీర ధరించి
గుత్తంపు రవిక జగ్గుగఁ జక్కబరిచి
పుత్తడిసొమ్ములు పొందుగాఁ బూని
తీరైన కస్తూరితిలకంబు దిద్ది
దారిగా జడను బూదండలు జుట్టి
మెరుఁగారు నెమ్మేను మిసమిసలాడ
సరసవాసన గల చందనం బలఁది
మొగములో శీవి కెమ్మోవిలో తావి
బిగవులో తేట లేపెదవిలో మాట

---

1. కంతుని కింకన.
2. రతీ.

కన్నులలోఁ దళుక్క కౌనులో బెళుక్క
చన్నుల కులుక్క ముచ్చటలలో నలుక్క
కలిగిన వొయ్యారి కంతుకటారి
చెలులలోన మిటారి చిన్నారి నారి
కలహంసదారిఁ జక్కని చుక్క మీరి
తిలకించి యారతీదేవి తా వెడలె.

### దరు - రాగం ఆహరి - తాళం అట

నిన్ను చల్లని మెరు పందురు చందమామా! మింటను
నిండుచిచ్చై యుండ తగవా చందమామా! ॥ ౧ ॥

పున్నమను నిన్ను పూజచేసెద చందమామా!
కన్నెను నన్ను నేఁచకువయ్యా! మొక్కెద చందమామా ॥ ౨ ॥

గరళము నీ కనుజన్ముం డగు గద! చందమామా! యాగుణ
గరిమె సోఁకకయుండునే నిను చందమామా! ॥ ౩ ॥

తరుణులను వెత లిడుదురా! ఓ చందమామా! నెమ్మది
తలఁప నీకిది రాజధర్మమే చందమామా! ॥ ౪ ॥

### దరు - రాగం కేదారగౌళ - ఆదితాళం

తొలకరి మెరుపుజాడగా రతి వెడలె
తొయ్యలు లందరు జూడగా
చెలులు సేవలు సేయగా ఘల్లుఘల్లని
గిలుకు టందెలు మ్రోయగా ॥ ౧ ॥

చికిలి చూపులు మించగా నెమ్మొగమున
చిన్నినవ్వు రాణించగా
మకరాంకుని వరించగా మెల్లనె వచ్చె
మది కోర్కె లినుమడించగా ॥ ౨ ॥

సూత్ర: (ఇత్తైఅంగున) రతీదేవి వచ్చిన తదనంతరంబున జీవాత్మపరమాత్మలు మాయాదేవి మొదలైనవార్లు రతీమన్మథుల వివాహమునకు యాజ్ఞికంబు సేయను షట్పోళి తిమ్మణభట్లున్ను, దోశల కాశీభట్లునున్ను పిలిపించగా [1]నొజ్జ లిద్దరున్ను వచ్చేమార్గం.

చ. తనరఁగ నారు పోశ లవధానముగాఁ గ(బ)ళింతు నంచుఁ దాఁ
[2]దిని పెనుపొట్ట వ్రయ్యగను దిమ్మణభ ట్లరుదెంచె వెంటనే
మొనసిన [3]మిట్టపండ్లు పెనుమూఁపును గంతి నటింపఁ గుంటుచున్
గనుగును మంచు వచ్చె నిటు గొబ్బున దోసెల కాశిభ ట్లొగిన్.

దరు - రాగం ? - తాళం శాపు.

దోవతికట్టు వీడగా కోవికడుపు వాడగా
తీవరముగ షట్పోళి తిమ్మణభట్లు వచ్చెను ॥ ౧ ॥

గుంటకండ్లు గొగ్గిపండ్లు [4]పంటివీఁ పలరా విప్ర
కంటకుఁ డైన దోసెల కాశిభట్లు వచ్చె నయ్యా ॥ ౨ ॥

సూత్ర: (ఇత్తైఅంగున) షట్పోళి తిమ్మణభట్లును దోసెల కాశీభట్లున్ను వచ్చిన యాతదనంతరంబున పేరటాండ్లు వచ్చేమార్గం.

దరు - రాగం సౌరాష్ట్ర - ఆదితాళం

తెల్లని చీరలు చుట్టుకొని నల్లపూసలు కట్టుకొని
పిల్లల చంకల బెట్టుకొని పేరటాండ్లు వచ్చిరి ॥ ౧ ॥

చండ్లు తొడలపై వ్రేలగను చంకకుచ్చు లసియాడగను
పెండ్లిపాటలు పాడుచును పేరటాండ్లు వచ్చిరి ॥ ౨ ॥

---

1. వొ ప్తలిద్దరున్ను. 2. దినిపెనుపుట్ట వ్రయలగాను తిమ్మణభట్లరు దెంచవెంటనే.
3. మిట్టపండ్లుప్పును 4. వంటివీఁపలరా

సూత్ర : (ఇత్తెఱంగున) పేరటాండ్లు వచ్చిన యాతదనంతరంబున రతీమన్మథులకు యథోక్తంబుగా వివాహంబు గావించి రాసమయంబున గంధర్వులు మంగళము పాడే క్రమము.

ఘంటారాగం - ఝంపతాళం

జయమంగళం శుభమంగళం ॥

మంగళ మఖిలజగన్మయునికి చిదాత్మునికి
మంగళం వీతగుణమానునికిని
మంగళం సతతనిస్సంగునికని శివునికిని
మంగళం బానందమయుని కిపుడు ॥ ౧ ॥ జయమంగళం

మరుమరీచిక లనుచు మాని సంసారముల
పరమసుజ్ఞానులై పరగువారికిని
నీరుజస్వాంతసితనీరజాంతరములను
తిరుగుచుండెడి మేటి తేటి కిపుడు ॥ ౨ ॥ జయమంగళం

పలుమారు శివభక్తి బాయకను నీతితో
నిల నేలు వరభోసలేంద్రుఁడైన
తుళజభూపతిపాల వెలయు పరమాత్మునికి
పొలుపొందు శశికలాభూషణునికి ॥ ౩ ॥ జయమంగళం

శ్రీమద్భోసలకులకలశాంభోధిరాకాశశాంక సమరనిశ్శంక వృషాంగపాదపంకజసేవాధురంధర సకలభాషాకవితానిర్వాహక విలసదేకమహారాజదీపాంబికాతనూజ శాహమహారాజశరభరాజన్యానుజ తుళజమహారాజప్రణీతం రాజరంజనవిద్యావిలాసనామనాటకం పరమాత్మప్రీతయే సకలవిద్వన్ముదే సకలశ్రేయసేస్తు.

శ్రీ దక్షిణామూర్తయే నమః.

